# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర మాఘ శు॥ ౧౨

సోమవారము


## వతందారుల అవస్థ

కరీంనగరుజిల్లాలో పటేలుపట్వారీలకు కొన్ని యిబ్బందులు కలిగినవని వార్త వచ్చినది. నిజామాబాదులోని కొన్ని తాలూకాల లోను అట్టి యిబ్బందులే మొదలైనవనియు వార్త వచ్చినది. కరీంనగరుజిల్లా అవ్వల్ తాలూక్దారు జిల్లాలోని తహసీల్దారుల కందరికిని పంపిన ఆజ్ఞ యొక్క ప్రతినొకటి మా విలేఖకుడు మాకు పంపియున్నాడు. అది ౧౫ బహమన్ ౧౩౫౦ ఫసలి నాటిది. అందలి ముఖ్యవిషయము లిట్లున్నవి.

"గ్రిగ్సన్‌గారు భూమ్యాదాయశాఖాధికారిగా ఉండినకాలములో పటేలు పట్వారీలు నిష్కారణముగా గుమస్తాలను ఏర్పాటుచేయకూడదని శాసించియుండిరి. అస్సలు వతన్‌దారులు ముసలితనముచేత కాని, స్త్రీలుగా ఉండుటచేత కాని, అనేకగ్రామాల వతనులు కలవారగుటచేత కాని గుమాస్తాలను ఏర్పాటు చేసుకొన వచ్చును. అస్సలుదారు స్వయముగా పనిచేయుటను తప్పించుకొన జూచినట్లయిన సర్కారు పక్షమునుండి గుమాస్తాలను ఏర్పాటుజేసి సేవలు ఏమిన్నీ యియ్యకుండా ఉండవలెను."

ఈయాజ్ఞ గ్రిగ్సన్‌గారి ఆజ్ఞపై ఆధారపడియున్నదట. గ్రిగ్సన్‌గారి ఆజ్ఞలో యేమేమి విశేషాలున్నవో అది మాల్ శాఖవారి ఆజ్ఞగా పరిగణింప బడుచున్నదో లేదో ఇదివరలో వర్తించుచూ వచ్చిన మాల్ గష్తీలను, ఖానూనును గ్రిగ్సన్‌గారి ఆజ్ఞ ఖండించకలదో లేదో ప్రభుత్వమువారు నిర్ణయించ వలసియుండును. ఈతాలూక్దారుగారి ఆజ్ఞపైన చూచుటకు అంతగా తప్పు పట్టరానిదిగా కనబడు చున్నది. కాని దానిని కార్యరూపమునపెట్టుటలో దానివ్యాఖ్య వ్యక్తమగుచున్నది. పెక్కు గ్రామాలకు ఒకే వతన్‌దారు కొన్ని తావులలో ఉండుచు వచ్చినాడు. అట్టితావులలో అసలుదారులే పని చూచుకొను చున్నారు. లేదా తమ కనుకూలురైన గుమాస్తాలను ఏర్పాటు చేసుకొనుచున్నారు. ఇది భూశాఖా శాసనములకు అనుగుణ్యముగా జరుగుచున్న పద్ధతియే.

కరీంనగరుతాలూక్దారుగారి ఆజ్ఞాప్రకారముపై జిల్లాలోని అనేకగ్రామాలలో ఒకటికన్న యెక్కువగ్రామాల వతనులు కల చోట అసలుదారుల గుమాస్తాల తీసివేసి అసలుదారులకు కూడా అనుమతి నియ్యక, సర్కారునుండి ఉద్యోగులను నియమించుచున్నారని తెలియవచ్చినది. పై యాజ్ఞ ప్రకారము సర్కారు నుండి యేర్పాటైన తర్వాత అసలుదారులకు "మాలికానాహక్కు" కూడా దొరకనేరదు. పై యాజ్ఞలో అసలుదారులు స్త్రీలుగా ఉన్నచో లేక ముసలివారుగా ఉన్నచో లేక అనేకగ్రామాల వతనుదారులైనచో గుమస్తాను నియమించవలెనని ఉన్నది. కాని యింకా రెండు మూడు కారణాలు మరచిపోయినారు. అస్సలు దారు తెలివి లేనివాడైనట్లు కనబడినచో, పిల్లవాడైనచో, పిల్లఅయినచో, తిక్కవాడైనచో, డాక్టరు అభిప్రాయములో తగినవాడు కానిచో సదా రోగి అయినచో......అని మరికొన్ని షరతులుకూడ చేర్చుటకు వీలుకలదు.

అనేకగ్రామాలపై వంశ పారంపరేణ కలగిన వతన్ అధికారమును వతనుదారులు వదలుకోజాలరు అనేక గ్రామాలపై వంశపారంపరేణ వచ్చిన జాగీరు ఇనాము అధికారములను జాగీర్దారులును ఇనాముదారులును వదలుకోజాలరు.

జాగీర్దారులు అంత అపురూపమైన తెలివిగలవారా మరి? వారికొకగ్రామము చాలదా? తక్కినగ్రామాలను సర్కారు వారికప్పజెప్పరాదా? సంస్థానాధిపతులు హాయిగా వారును తదితరులును అనేక గ్రామాల నెట్లు విచారించు కొనుచున్నారు. అది సవ్యముగాలేదని యిదివరలోనున్న శాసనాలను రద్దుచేసి క్రొత్త ఆజ్ఞలను జారీచేయవీలుండునా? బీదవతనుదారులే పాపముచేసిరి? అందరును వారిపైననే నేరములు మోపు చుందురు. గ్రామ రైతులను వారే పీడించువారనియు, లంచాలను వారే ప్రోగుచేయువారనియు, దౌర్జన్యము వారేచేయువారనియు, వెట్టిపనులను వారేచేయించువారనియు, నేరములు కుప్పకుప్పలుగా వారిపై మోపబడు చుండును. అయితే వారు పైవాటిని చేయరనికాదు. కొంచెము గానో గొప్పగానో చాలాప్రాంతాలలో పైవాటిలో కొన్నియైనను జరుగుచున్నవి. కాని వారినేరముమాత్రమే కాదు. తహసీలు సేగేదార్లలోను, గిర్దావర్లలోను, తాలూకా పోలీసు అధికారులలోను, కొందరినైనను సంస్కరించవలసి యుండును. ఈపద్ధతులు మార్పించుట కేయే సంస్కారములవసరమో వాటిని ప్రభుత్వమువారు ఒక విచారణ సమితిద్వారా విచారింపజేసి మంచి కట్టుదిట్టములు చేసినచో యీ వతనుదారుల చర్యలు మటుమాయమైపోవును.

ఇప్పుడు చెప్పబోయిన దేమన కరీంనగరు తాలూక్దారు చేసిన ఆజ్ఞయొక్క ఫలితములను గురించి భూమ్యాదాయ శాఖాధికారులు విచారణ చేయించుట అవసరమైయున్నది. ఏయేగ్రామాలలో అస్సలుదారులను తీసివేసినారు. వారిస్థానములో ఎవ్వరిని ఉంచినారు. వారు వతనుదారుల వంశీయులా లేకదాయాదులా లేక బంధువులా? విచారింప చేయవలెను. ఒకవేళ ఏదైన గ్రిగ్సన్ దొరవారి ఆజ్ఞవంటి ఆజ్ఞ బహువతనుల నిషేధమునకే ప్రాధాన్యతకలిగినచో అట్టి వతనులపై అస్సలుదారుల వంశీయులకే మైన అధికారముండునా? అదియులేదా! ప్రభుత్వమువారు చారించుకొన గలరు. ఒకవేళ కరీంనగరములో ప్రత్యేక పరిస్థితులేర్పడినచో అవేవో స్పష్ట పరుపవలెను. ఈ యాజ్ఞ మా అభిప్రాయములో భూశాఖా శాసనములకు విరుద్ధము. ఇది వతనుదారులకు కష్టనష్టములు కలిగించునట్టిది. దీనిని వెంటనే ఉపసంహరించుకొనుట న్యాయపద్ధతి అనినా అభిప్రాయము.

—

# బాలసరస్వతీగ్రంధాలయము

## శంఖుస్థాపన

### రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారి అధ్యక్షత

మొన్న శుక్రవారము ౩-౭-౫౦ఫ నాడుమహబూబునగరములో అపూర్వమైన ఉత్సాహము సంచలనముకలిగెను– ఎంతో కాలమునుండియీ పట్టణములో తెలుగుగ్రంథాలయము ఎట్లోఒకవిధముగా పనిచేయుచుఉండినది– ఒకసంవత్సరం నుండి దానిఅభివృద్ధికై ఇచటికొందరుప్రముఖులు బాగుగాప్రయత్నాలు చేయుచువచ్చినారు. తుదకుగ్రంథాలయానికి సొంతభవనములేకయుండుట చాలాలోపమని భావించిరి. ఈజిల్లాలో అనేకఆంధ్రసంస్థానాలు, అనేకదేశముఖులు, అనేకజాగీర్లు, ఉండియు ఈభాషాసంస్థకీ దారిద్ర్యమెందుకుఅని పలువురుచింతించుచుండిరి. ఒకసంవత్సరమునుండి రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారి అధ్యక్షతతోనే యీపని సాగింపవలెనని తత్రోత్సాహకులు కాంక్షించుచుఉండిరి. శ్రీవారు అనారోగ్యముచేత నేమి జిల్లాలకుపోవువారుకానందున నేము శ్రీవారొప్పుకొనరేమోఅని జంకుతూ నేఉండిరి. తుదకుమాభాగ్యవిశేషముచేతను సర్వజనప్రియులైన శ్రీవారు తమసహజముగు ఔదార్యముతో వెంటనేఅంగీకరించిరి. ఇకమాప్రముఖులకు పట్టరానిఆనందముకలిగి అత్యంతోత్సాహముతో సన్నాహములుచేసిరి. శ్రీవారికి సన్మానపత్రమును ఉర్దూ తెలుగుభాషలలో వ్రాసి మంచిపట్టుబట్టపైముద్రించి అద్దములోపెట్టిసమర్పించుకొనిరి.

శుక్రవారము వారు రైలులో హైదరాబాదు నగరమునుండి చాలామందిదిగిరి. శ్రీరాజాబహద్దరుగారును, శ్రీమాడపాటివారును, బూర్గులవారును [illegible] గారును, భాజంగారును, వడ్లకొండగారును,మందుములవరసింగరావుగారును మున్నగుప్రముఖులంతాదిగిరి. రైలుస్టేషనులో శ్రీవారిని వారిఅనుయాయులను ఆగంతకులను స్వాగతమిచ్చి స్వీకరించుటకు మామహబూబునగర పట్టణమునుండి నందగిరి గారును మాడిగేరిగారును, పురప్రముఖులను, ముస్లింప్రముఖులను, వకీళ్లును, అధికారులును వెళ్ళిరి. మహమ్మదుతకీ న్యాయాధికారు శ్రీరెడ్డిగారికి చాలాప్రియులైనవారు. వారికిపరస్పర ప్రీతి చాలాఅపారము. వారు ప్రేమతో శ్రీరెడ్డిగారికి స్టేషనులోస్వాగతమిచ్చిరి. శ్రీరాజాబహద్దరుగారు వకీలు మాడిగేరి నారాయణరావు గారిభవనములో బసచేసిరి.

౧౧ గంటలకుశ్రీవారును ప్రముఖులును శంఖుస్థాపనస్థలమునకువిచ్చేసిరి అచ్చటికి అవ్వల్ తాలూకుదారు గారును హిందూముస్లింవకీళ్ళునువిచ్చేసిరి.

శాస్త్రోక్తముగా బ్రాహ్మణపురోహితులు మంత్రాలుచదివి టెంకాయకొట్టిరి. శ్రీవారు వెండితాపీతో శంఖుస్థాపనకావించిరి. ఆ వెండితాపీని జ్ఞాపకచిహ్నముగా శ్రీవారికిబహుమానము చేసిరి. తర్వాత సభప్రారంభమయ్యెను. మాడిగేరిగారు ఉర్దూసన్మానపత్రమునుచదివిరి. నరసింహారావుగారు తెలుగుపత్రమునుచదివిరి. తర్వాత నందగిరి వెంకటరావుగారు గ్రంథాలయనివేదికనుచదివిరి. తర్వాత గ్రంథాలయమునకై ద్రవ్యసహాయము చేయవలెనని నారాయణరావుగారు ఉర్దూలోను బూర్గులవారు తెలుగులోను ఉపన్యాసించిరి.

తర్వాత శ్రీరాజాబహద్దరు గారు సర్వజనరంజకముగా ఉర్దూలో ఒకగంటకాలము ఉపన్యాసముచేసిరి. ఆవివరములుముందు ప్రకటింపబడును.

ఆటుపిమ్మట రాజాబహద్దరుగారు గ్రంథాలయానికి ౧౦౦౦ రూపాయీలు దానముచేసిరి. ఆ తర్వాత యం. నారాయణరావుగారును ౧౦౦౦ ఒకవేయిరూపాయీలు ఈ గ్రంథాలయభవనానికి ఇచ్చునట్లు వాగ్దానముప్రకటించిరి.వచ్చినసభ్యులు ౬౦౦ రూ-చందాలుచేసిరి.

ఒకటిగంటకు అందరును భోజనముచేయదారించిరి, మధ్యాహ్న భోజనము రాజాబహద్దరుగారు న్యాయాధికారిఇంటిలోకావించిరి, సాయంత్రము ౩ గంటలకు నందగిరివెంకటరావువకీలుగారు స్థానికాగంతుక ప్రముఖులకందరకును విందుగావించిరి, అందుల్లో అధికారానధికారాది సజ్జనులందరును పాల్గొనిరి. తర్వాతసాయంత్రము ౬ రైలులో రాజాబహద్దరుగారునువచ్చినపెద్దలు వెళ్ళిపోయిరి.

రాజాబహద్దరు గారిమూలాన ఈపట్టణములో హిందూముస్లింఐక్యత ప్రబలిపోయినది–వారిమూలాన ఉభయులునుకలిసి బాగాప్రేమించుకున్నారు–అధికారులును శ్రద్ధబూనినారు ఈకారణాలచేగ్రంథాలయభావ్యభివృద్ధికి మంచిపునాది ఏర్పడింది

× × ×

## సన్మానపత్రము

### శ్రీరాజా వెంకట రామారెడ్డి బహద్దర్

ఓ. బి. ఇ. గారి దివ్యసన్నిధికి

శ్రీ బాలసరస్వతి ఆంధ్రగ్రంథాలయ నూతనభవన శంకుస్థాపన సుముహూర్తమున, మహబూబునగరుజిల్లా వాసులము గు మేము, తమకు సన్మానపత్రము సమర్పించు సదవకాశము లభించినందులకు ధన్యులము.

అన్నిజిల్లాలలో మహబూబునగరము జిల్లా ప్రత్యేకస్థానము సంపాదించుకొన్నది. తాము జన్మించిన రాయనిపేట ఇందులోనిదే. తాము ప్రభుత్వోద్యోగులుగా నున్నప్పటికాలములోని తమ సర్వజన ప్రియత్వము, తమ సాటిలేని సేవలు, ఎన్నటికిని మరుపునకురావు.

రక్షకశాఖలోని ఉత్తమోత్తమస్థానమగు నగరకొత్వాలీ పదవిని అత్యంత బాధ్యతతోను, అతి నిపుణతతోను నిర్వర్తించి ప్రభుభక్తికి ప్రమాణభూతులైతిరి.

కోర్టు ఇన్‌స్పెక్టర్, మొహతిమీం, పదవులలో తా మెచ్చటెచ్చట ప్రజాసేవచేయుటకు అవకాశము లభించెనో అచ్చటచ్చట తాము, నిగ్రహముతో కరుణారసమును, పట్టుదలతో న్యాయసమ్మతమును, ప్రకటించినట్లు అనేక నిదర్శనములు తమ ఉద్యోగకాలములో లభించుచున్నవి.

ఉన్నతస్థితిలో నుండియు సామాన్య జీవనము, సౌఖ్యవిలాసములకు వకాశములున్నను విరామములేని నిత్యపరిశ్రమ, ఘనకార్యనిమగ్నతవలన తీరిక లేకపోయినను అతిసాధారణ విషయములందును శ్రద్ధ, ఇట్టి అసామాన్య గుణగణములచే విభ్రాజితులగుట తమ జీవితములో అడుగడుగునకు వ్యక్తమైయున్నది.

రాష్ట్రవాసులయొక్క విద్యా, సామాజిక, ఆర్థికసమస్యలయెడ తమకుగాఢమైనఅభిమానము కలదనుటకు ప్రభుత్వ సంబంధమైనట్టియు, ప్రజాసంబంధమైనట్టియు సంస్థలలో తమసేనాలాభము పొందనిసంస్థ ఒకటియైనను లేదనుసంగతియే ప్రబల నిదర్శనము.

విద్యార్థులయొక్కయు, విద్యార్థినులయొక్కయు నివాసగృహములు, గ్రంథాలయములు, బాలబాలికా విద్యాలయములు, బాలబాలికా స్వచ్ఛంద భటదళములు, అనాథాలయములు, రాష్ట్రములోని యువతీ యువకుల అభివృద్ధికి అవసరములైనవి, మీ పాలనలో వృద్ధిచెందుచు వచ్చినవి. తమ అనుగ్రహము ఒకవర్గము వరకే పరిమితి చెందినది కాక హరిజన జైన, క్రైస్తవ, ముస్లిము మున్నగు వివిధవర్గములకును విస్తృతమైనదై యున్నది.

దేశముయొక్కయు శ్రీ శ్రీ ప్రభువుయొక్కయు సేవనుచేయుటకు శక్తిసామర్థ్యములను ఇతోధికముగా ప్రసాదించి తమకు చిరకాలముఆయురారోగ్య సంపదను అనుగ్రహించుటకై పరబ్రహ్మను మేము మనసార ప్రార్థించుచున్నాము.

మహబూబునగరము
౩౦ఆర్డిబెహస్తు౧౩౫౦
విక్రమ ఫాల్గుణశు॥
ఇట్లు
విన్నవించు విధేయులు,
బాలసరస్వతీ
గ్రంథాలయసభ్యులు

—

## నాందేడు ఘోరాలు

### నిందితులందరి విడుదల

ఇదివరలో నాందేడులో జరిగినఅల్లరులలో ౨౫ మందిముసల్మానులపై ఖూనీ, డాకా, అల్లరిమున్నగు నేరములుఆరోపింపబడి న్యాయస్థానములో విచారణలోనుండెను, ఔరంగాబాదు సెషన్‌లో విచారణజరిగినతరువాత ౨౬ ఫర్వర్దీ నాడు న్యాయాధికారి నేరములలో సాక్ష్యమురుజువుకాలేదని అభియోగములనుకొట్టివేసి నిందితులందరిని విడుదలచేసివేసిరి.

ఈయానందమును ప్రకటించుటకుగానునాందేడులోని హోటల్ యజమానిఅయినఅబ్దుర్రహిమాన్ అనునతడు నిందితులకు గొప్పవిందుచేసెను. విందులో ఉపన్యాసాలుజరిగెను. అట్టిసభలో పద్యాలుచదువబడెను, నాందేడుముసల్మానులు అభినందింపబడిరి, మ-ఘ-వ-నిజాం ప్రభువుగారి ఆరోగ్య క్షేమాలనుగురించి ప్రార్థనచేసి సభ ముగించిరి.

## కరీంనగరు తాలూక్దారు వింతచర్య

### చందూరుపట్టి గ్రామాధికారుల సంఘ తీర్మానము

హైదరాబాదు మార్చి ౯.

కార్యకారిణిసంఘ సభ్యులు ౩౧-౫-౫౦ఫ తేదినాడు షర్కు తాలూకాలోని చందూరులో సమావేశమై ఈతీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించినారు.

"కరీంనగరు అవ్వల్ తాలుకుదారు గ్రిగుసన్ డైరెక్టర్ జనరల్ గారిఉత్తర్వు తనక్రింది అధికారులకు పంపిన మురాసిలని(రా) ౧౫బహమన్ ౫౦సాలు నకలు మేమాశ్చర్యముతో చదివితిమి, శ్రీవారు మాముఖ్యమగు హక్కులకే భంగం కలిగించినందులకు చాలా విచారిస్తున్నారము. గుమాస్తాల యావత్తూభారం అసల్‌దారే వహించునపుడు శ్రీవారిపరిపాలనాపద్ధతుల కేమి భంగంకలుగునో సర్కారుపక్షాన గుమాస్తాలే పనిచేయుగానే శ్రీవారిపరిపాలనాపద్ధతులు ఎలా సరిగా ఉండునో? మాకుతోచడంలేదు. మాలికానా హక్కు ఇవ్వకుండ సర్కారుగుమాస్తాలపూర్తి సేవలుమీద నియమించుటకు తనక్రిందిఉద్యోగులకుత్తరువు లిచ్చుట మరింత చోద్యం కలిగించుచున్నది. శ్రీవారు మాయీ హక్కులను కొదవజాలరని యు. వెంటనే తమఆజ్ఞలను ఉపసంహరించుకొని ఈలాంటి ద్వేషపూరితమైన ఆజ్ఞలనికముందు యివ్వకూడదని వేడుచున్నారము. పైఅధికారులు కూడ యీవిషయమైపట్ల తగుశ్రద్ధ వహించగలరని కోరుచు. ఇకముందుకూడ ఇలాహక్కులకు భంగం కలిగించకుండా ఉత్తరువుల దయచేయురని వినయంగా కోరుచున్నారము."

# మైసూరు సంస్థానపు క్రొత్త రాజ్యాంగము

## శాసనసభలలో కాంగ్రెసు బలము

బెంగుళూరు, మార్చి ౧

౧౯౪౦ మార్చి ౧వతేదినుండి మైసూరు సంస్థానపు క్రొత్తరాజ్యాంగసంస్కరణలు అమలు లోనికి రాగలవు. ఈ క్రొత్త రాజ్యాంగముయొక్క ప్రధానలక్షణమేమనగా, మంత్రివర్గమొకటి ఇక మీదపనిచేయుచుండగలదు. మంత్రివర్గమందు దివాను, నలుగురికితక్కువకాకుండ మరికొందరు మహారాజాగారిచే నియుక్తులైనవారలుసభ్యులుగానుండి ఆసంస్థానపరిపాలనవిషయములలో మహారాజాగారికి సలహానిచ్చుచు తోడ్పడుచుందురు. శాసనసభలగు రెప్రజెంటేటివ్ అసెంబ్లీలోనుండిగాని, లెజిస్లేటివ్ కౌన్సిలులోనుండిగాని యిరువురికైనను మంత్రులనుగా నియోగించవలెను.

ఇపుడుఅట్టిప్రజాప్రతినిధులలోనుండి ఏపక్షమువారు మంత్రులయ్యెదరు, ఎవరికి బలమెక్కువ అనేప్రశ్నవచ్చును. 'అసెంబ్లీ'లో మైసూరుస్టేటుకాంగ్రెసుపార్టీవారిప్రతినిధులు అత్యధికసంఖ్యాకులుకాకున్నను ౧౦౬మందిసభ్యులు అపార్టీవారేగాన, ఆపార్టీవారికి అసెంబ్లీలో మంచిపలుకుబడియున్నది. ఇకఅంతబలము మరిఏపార్టీకిని అసెంబ్లీలోలేదు. మధ్యకాలంలోజరిగే ఎన్నికలలో స్టేటు కాంగ్రెసువారు తమప్రతినిధులనుపోటీచేయించగలరు. ఇంకొకఅంశమేమనగా, ఇటీవలజరిగినఎన్నికలలో స్టేటుకాంగ్రెసువారు పోటీకిసూచించిన ౩౨మంది తమపార్టీవారి పేరులు ప్రభుత్వమువారిచే అంగీకరించబడక త్రోసివేయబడినవి. ఇప్పుడుఆపేరులవిషయమై 'యలెక్షన్ ట్రిబ్యునల్' వారు విచారణచేయుచున్నారు. ఆ విచారణలో ఆ౩౨పేరులు ఆమోదించబడినచో కాంగ్రెసువారికే అసెంబ్లీలో స్పష్టంగా అధికసంఖ్యాబలముండును. మంత్రులనుగా మహారాజాగారు తమయిష్టమువచ్చినవారిని తీసుకొనవచ్చునుగాని, శాసనసభలో కాంగ్రెసుపార్టీకి అంతబలమున్నపుడు ఆపార్టీనాయకునిఅడిగి ప్రజాప్రతినిధులనుండి మంత్రులనునిర్ణయించుట మంచిదని కొందరు ఆసంస్థానపుపెద్దలు సూచించుచున్నారు. కాంగ్రెసువారు తమఅసెంబ్లీలో అధికసంఖ్యాబలమున్నను తాముమంత్రివర్గనిర్మాణానికి సమ్మతించమనుచున్నను, మహారాజాగారు కాంగ్రెసువారిని మంత్రివర్గ నిర్మాణానికే ఆహ్వానించుచో ఆసమాధానము కుదరవచ్చును.

లెజిస్లేటివ్ కౌన్సిల్ యొక్క మొదటిసమావేశము ౧౯౪౧జూను ౨౨వతేదిన ప్రారంభమగును. మొదటినాలుగేండ్లు మహారాజాగారు నిర్ణయించినవారు దానికధ్యక్షులుగా నుందురు. ఆ తర్వాత లెజిస్లేటివ్ కౌన్సిలుసభవారెన్నుకొనిన తర్వాత మహారాజాగారి ఆమోదముపొందిన ఒకసభ్యుడు అధ్యక్షుడగును. తీర్మానములను ప్రతిపాదించనిచ్చుట, ప్రశ్నలనువేయనిచ్చుట, ఇట్టివిఅన్యతుని పనులుగ నుండును.

—హిందూ.

# భారతదేశసమస్య పరిష్కారము

### బ్రిటిషుసామ్రాజ్యక్షేమానికి అవసరము

### బ్రిటిషుకార్మికనాయకునికి హెచ్చరిక

బ్రిటిషుట్రేడుయూనియన్ కాంగ్రెసుఅనబడు కార్మికసంస్థయొక్క అధ్యక్షుడగు జార్జిజిబ్సన్‌గారు డొమినియనులలోను, భారతదేశములోను ఉండేపత్రికలప్రతినిధులు హాజరైన ఒక విందులోమాట్లాడుచు బ్రిటిషుప్రభుత్వము భారతదేశసమస్యను పరిష్కరించనిచో బ్రిటిషుసామ్రాజ్యము భగ్నముకాగలదనిచెప్పిరి. మీరుమీరు ఏదోఒకవిధంగాఒడంబడిక కుదుర్చుకొంటేనేగాని మేమేమీచేయజాలమని చెప్పడంమాని బ్రిటిషుప్రభుత్వమే భారతదేశానికి ఏదోఒకపరిష్కారంకుదుర్చుటలో తోడ్పడవలయునని వారనిరి.

ఫిబ్రవరి ౨౮వతేదిన జిబ్సన్‌గారు జార్జిసార్వభౌముని దర్శించి సంభాషించిరి.

# భారతనాయకుల విడుదలకై బ్రిటనులో ప్రచారము

జవహర్లాలునెహ్రూ మున్నగు భారతజాతీయముఖ్యులవిడుదల చేయవలెననికోరుటకు ఇండియాలీగువారు లండనులోహాల్బర్ను హాలులో ఒకపెద్దసభను సమావేశపరచిరి.ఆసభయందు నెహ్రూగారికి విధించిన ౪ ఏండ్లకఠినశిక్ష ఘోరముగానున్నదనియు, ఇంకను ఆనేతలను ఖైదుచేయుట బాగుగాలేదనియు, వారలను విడుదలచేయవలెననియు, వెంటనే భారతదేశము స్వాతంత్ర్యము, స్వపరిపాలము అనుభవించుటకు హక్కుగలదనియు ఒప్పుకొనవలెననియు తీర్మానములు చేయబడినవి. పార్లమెంటుసభ్యులుకొందరు సభవారివలెనే తమకును జవహర్ లాల్ మున్నగువారలకువిధించినశిక్షలు అసమ్మతములని సందేశములనిపంపిరి. బ్రిటనుదేశమందంతటను ఇట్టిసభల నేజరిపి ఇట్టితీర్మానములనే ఆమోదింపజేయుటకుయత్నాలుచేయుచున్నారు.

# ఆరునెలల్లో ౪౦౦౦ దోపిళ్లు

### సింధు రాష్ట్రపు దుస్థితి

సింధు అసెంబ్లీయొక్క ఫిబ్రవరి౨౫వతేదివాటిసమావేశంలో కొన్నిప్రశ్నలకు సమాధానమిచ్చుచు ప్రధానిగారు ౧౯౪౦ జనవరినుండి జూలై ఆఖరువరకు సింధురాష్ట్రంలో ౨౪౦ మహమ్మదీయులహత్యలును, ౨౩హిందువులహత్యలును జరిగినట్లుచెప్పిరి. ౭౩సాయుధులదోపిళ్లు, ౪౨౨౯ బందిపోట్లు జరిగెననియు, వీటిబల్ల౨౩౧ మంది ముసల్మానులు, ౧౯౦౯మందిహిందువులును బాధపడిరనియుచెప్పిరి. దుష్టులను పట్టుకొనుటకై ప్రభుత్వమువారు చాలశ్రద్ధతోప్రయత్నించుచున్నారనిరి. ఇందుకై రిజర్వుపోలీసులు ఎక్కువచేయబడిరనియు, జిల్లాలలో పోలీసులను మోటారులలో ఎక్కడికిఅవసరమైతే అక్కడికి వెంటవెంట తీసికొనిపోవుఏర్పాట్లు చేయబడినవనియు, టెలిఫోను సౌకర్యములు బాగుచేయబడినవనియు చెప్పిరి.

# వందేమాతరం కేసు

వందేమాతరం గడబిడరైన కాలములో కరీంనగరు ఉన్నతపాఠశాలలో ఒకవిద్యార్థి మహాదేవసింగుఅనువాడు ఒకవిద్యార్థిపై కొట్టబోయినట్లు చార్జి జరిగియుండెను. క్రిందికోర్టువారు అతనికి శిక్షవిధించియుండిరి. అతడు హైద్రాబాదు ఉన్నతన్యాయస్థానములో అపీలుచేసియుండెను. అతనిపక్షానజరిగిన వాదమును న్యాయమూర్తులు వినుచున్నారు. ఇంకను తీర్పుచెప్పలేదు.

# తప్పుడు జనాభా

### సంథాలు లెంతచెప్పుకొన్నను హిందువులలో చేర్చకుండుట

పాట్నజిల్లాలో పోల్బాతానాలో తప్పుడు జనాభాజరుగుచున్నది. సంథాలులను హిందువులు కానివారలలో చేర్చుచున్నారు. కూలీలు.బౌరీలు కూడ అడవిజాతులుగానే లెక్కించబడుచున్నారు. ఈతప్పునుసవరించుటకు ఎట్టిచర్యగాని గైకొనుటలేదు. సంథాలులు మొఱపెట్టుకొన్నను ప్రయోజనములేకుండా పోవుచున్నది.

# సింధు మంత్రివర్గస్థితి

### గాంధిమహాత్ముని సలహా

సింధురాష్ట్రంలో అజాదుగారు కుదిర్చిన ఏర్పాటుకు ఏపక్షంవారుగాని తిరస్కారముచూపిభగ్నము చేయుచో, అప్పుడుసింధు అసెంబ్లీ కాంగ్రెసుపార్టీవారు ఇపుడు అధికారంలోఉండేమంత్రివర్గాన్ని తొలగింపజేసి ఖాన్ బహాదర్ అల్లాబక్షుగారు మంత్రివర్గాన్ని ఏర్పరచుటకుతోడ్పడవలెనని గాంధిమహాత్ముడు సలహానిచ్చినాడు ఇదివరలో గాంధీగారు అజాదుగారి ఏర్పాటుభగ్నమైనపుడు అసెంబ్లీలోని కాంగ్రెసు రాజీనామాలిచ్చిబయటికిరావలెననిచెప్పియుండిరట. కాని మౌలానపుడు ఆదేఅభిప్రాయంతో ఉన్నారాఅని మహాత్ముని అడుగగా, వారుఅలాగా అజాదుగారి అభిప్రాయంకనుగొని క్రొత్తసలహా నిచ్చినారట.

# నిర్బంధవిద్య

పంజాబులో

పంజాబు ప్రభుత్వమువారు తమ సూబాలో ప్రాథమికవిద్యాశాసనము చేసియున్నారు. దానిప్రకారము ఇకముందు పైసూబాలోని బాలురకు ప్రాథమికతరగతులలో నిర్బంధముగా విద్య చెప్పింతురు.

# రాజకీయ ఖైదీల తరగతుల భేదాలు

మార్చి౩వతేదిన మదరాసునగరంలో డాక్టరు పి. వరదరాజులుగారి అధ్యక్షతలో కాంగ్రెసు భవనంలో జరిగినబహిరంగసభలో రాజకీయఖైదీలలో ఇపుడుచేయుచుండే తరగతుల భేదాలను వదలి, అందరిని ఒకటేతరగతిగా చేర్చవలెననితీర్మానమామోదించబడినది.

# హైదరాబాదు నిమ్నజాతి సంఘము

సికింద్రాబాదు(దక్కన్) మార్చి ౩

హైదరాబాదుసంస్థాన నిమ్నజాతిసంఘ ప్రధానకార్యదర్శి ఇట్లు తెలుపుచున్నారు:—

హైదరాబాదుసంస్థాన నిమ్నజాతి సంఘముయొక్క అధ్యక్షుడగు బి.యస్. వెంకట్రావుగారు జనగణనవిషయంలో జిల్లాలకుపంపిన కొందరినిగూర్చి చాలమందిఅడిగినారు అందువల్ల ప్రజలకు తెలియుటకై నేను తెలిపేదిఏమనగా, ఆసంఘముయొక్క కార్యవర్గ సమావేశము జరుపలేదు. అటువంటి తీర్మానమేదియు ఆమోదించబడలేదు. అధ్యక్షులవారు కార్యవర్గముయొక్క అనుమతిని పొందలేదు. కాబట్టి వారుప్రచారకులను తమంతటతామేపంపించినట్లు భావించవలెను, అందువల్ల బి.యస్. వెంకట్రావుగారియొక్కగాని, వారు పంపిన ప్రచారకులయొక్కగాని చర్యలేవియు సంఘమును బంధించజాలవు.

# ★ స హృ ద య ము ★

చిరకాలముక్రిందట సత్య ధర్మంబుల గాంక్షించి ప్రజాసామాన్యమునందుగల లోపంబుల సంస్కరించి పరహితకాంక్షాబద్ధకంకణుల పై స్థాపించిన మా విజ్ఞానపరిషత్తు కొంతకాలము లోకమర మ్మతుచు గావించి విశ్రాంతిగైకొనియున్నది. పరిషత్సభ్యులు సొంతపనుల పై స్వగ్రామములకేగియిటీవల నేదిరిగి విచ్చేసియున్నారు.

తిరిగి మా కార్యాలయమును దెఱచి యథావిధి తమనిర్దిష్టకార్యక్రమంబు నిరాఘాటముగ సాగింప ప్రారంభించి నిర్విఘ్నత కై సత్సనాతన ప్రాచీనార్య సాంప్రదాయానుసారముగా విఘ్ననాథుని విస్మరింపక శతసాష్టాంగములసమర్పించి, సత్యము పట్లు మోమోటము లేక నిర్వచించుటకును సత్యవ్యాజమున ప్రజల సమార్గానువర్తుల గావించు దుష్టుల దుష్ప్రచారంబుల శతధాభిన్నము గావింపను నా లేఖినిని ఋజుమార్గగామిగా నొనర్పు సకలవిద్యాప్రదాయిని యగు శ్రీవాణీపతి నర్చించి యథాపూర్వముగ సకలాభీష్టదాయిని యగు కాత్యాయినికి నమస్కరించి సత్యాసత్యంబులు లోకంబున కెఱింగింప యథాసాధ్యము యత్నించుచున్నారము. మా లేఖిని చూడరానిస్థలంబులును చొరరాని ప్రదేశములు లేవు. మా సత్యాన్వేషణము నందొకింత మాబుద్ధికి తు ప్రథగాములుగా దలంచు నెవ్వరి నేని విమర్శింప మా లేఖినికి గొంకును జంకును లేదు. విమర్శకరూపంబగునట్టి మా లేఖినినిగాంచి గుమ్మడికాయలదొంగయన్న తమ బుజంబుల జూచుకొను మహనీయులవోలె యిది తమ గురించియే వ్రాయబడినదని యనుకొనుభోళ్ళ పెద్దబుద్ధిమంతులకు మున్ముందే హెచ్చరికగా జెప్పుచున్నారము వ్యక్తిగతదూషణ యిందుకిందు తావులేదనియు నొకవేళ యవలేని తమగూర్చియే వ్రాయబడినదని దలంచువో నయ్యది మా లేఖిని లోపంబు గాదనియు కేవలం వారివివేకశూన్యతయే గారణమనియు హెచ్చరించుచున్నాము.

దైవప్రార్థనముగిసిన వెంటనే మా విజ్ఞానశాస్త్రి యుస్సురనునిట్టూర్పులతో నలుదెంచి మోముచిన్నబుచ్చుకొని ఛీ ఛీ పాడు! పాడు! నాశనము నాశనము–సర్వనాశనమని గొణుగుకొనుచుండెను. కాలోన్మత్తుడూరుకొనలేక శాస్త్రి తనప్రక్కపోట్ట సవరించుకొనుచు మహాదేవస్మరపూర్వకముగా వాతని విచారముఖంబునకొకింత ప్రసన్నత గాంచి ప్రసంగాంతరము వాతనివిచారము నుబృచ్ఛజేసెను. అతనికి మా విజ్ఞానశాస్త్రి తనవిచారోదంతంబు నీరీతివినిపించె లంబోదరా. దేశము నలుప్రక్కల విషతాగ్నిజ్వాలలు వ్యాపించి చేడగాల భస్మీకరించుచుండ దానిజ్వాల్పు యత్నించువారిని జేపదిట్టుదుండగీడులు లోకములో నగలరా. ఇదిరో తయవివేకము కొంపలుగాలుచుంటే మీన మేషములెక్కించుతురా. ఎవడైతేనేమి అముంటలుదల్లార్పుటకు అంటరానివాడైన అసమయమున యంవరివంటివాడైన కొంపెక్కయూర్పవచ్చుగదా. ఇవియా పద్ధర్మంబులు గావా. అపత్కాలేనాస్తి మర్యాదయన్నారు పెద్దవారు బ్రాహ్మణునికొంపమునుగుకొన్నది. సనాతనరక్తపరాయణుడైన బ్రాహ్మణుతేగాని యీ కొంపనార్పనితే లుపశకిరారా? అట్లని యిట్టిబాపడు వచ్చువరకు కొంపతగులబడవలసినదేనా! అనుంటలు కొంపతో బోయినబాగుండును నే ఆకొంపలతో బోక నూరమున్న బ్రాహ్మణేతరాది సర్వగృహదాగా మొనరింపక మీకునా! ఇట్లనే మన ధర్మములు నుడిదేనా! పరోపకారార్థమిదంశరీరమనిగూడా పెద్దలుచెప్పుదురు! శ్రీరాముని నంతవాడు లోకహితంబును ప్రజాహితంబును గాక్షించి గాదే తన ప్రజలలో నొక్కడు గోరినరీతి భార్యనేని బరిత్యజించెను. విమిత్రప్రచారోద్భవ దుర్వారాగ్నిజ్వాలామాలికలు మొదలంట జల్లార్పసాగించిన విజ్ఞానవైద్యఘనాఘనచ్యుతశాఙ్కణప్రవాహంబులనోరిగట్టు విషకంఠుని ప్రతీకారమాకతి ప్రసారంబున కిదిరయేసమయమా! అహా! కాలము, దాని నిరసింపనేల విషకంఠుడగుట తానువిషంబును వెలిగ్రక్కుట నానిస్వభావంబు గాదే— నా యీ సాంస్కృత్యంబుచే నీవిషకంఠుడావిషకంఠుడగునా. ఎన్నటికిని గాదు— ఆవిషకంఠుడు లోకసంరక్షణార్థమై విషమునాహరించే—యీ విషకంఠుడు లోకసంక్షోభమునకై విషమువెళ్లగక్క, నలువైపుల ప్రజ్వలించు దారుణదావాగ్నులకు తనవిషపూరితక్రూరంబులచే నింకను ప్రజ్వలితమొనర్చె—అజ్వలనజ్వాలామాలికలు తన్నుగూడా దహింపకపోవునా. జ్ఞానంబు వానికేదయ్యో— ఇట్టిలోకదాహకులు సత్యప్రబోధకులా? పిల్లవానికి బుట్టుకతోడనే విద్యలలవడునా? ముందువానికక్షరాభ్యాసము గావలదా? అక్షరాభ్యాసంబు నకుగూడ పండితులేవలయునా? వీథిబడులలోని బంతులచే నక్షరములభ్యాసమొనర్చనవారెంతటి విద్యావిశారదులు గాలేదు. విజ్ఞానవంతుడనని వీఱవీగు మావెఱ్ఱివెంగళప్ప వీథిబడులలోనిపంతులచే నభ్యసితాక్షరాస్యుడే గాదా? ఇప్పుడేగ సర్వజ్ఞత్వము నారోపించుకొనియే—ఇంత మాత్రము వివేచనవలదా? దానే సర్వజ్ఞుడా? ఇయ్యది కూపస్థమండూకభ్రాంతి కాలోన్మత్తా? చేయునదేమి వానికిబుద్ధిజెప్పనెంచితినిగాని సమయముగాదని విరమించితిని? ఇంతలో సాయంసంధ్యకు వేళయ్యెనని మా శాస్త్రిలేచెను. మా కాలోన్మత్తుడు యథాప్రకారము కాలప్రవాహమునబడి యేదురదలేక రాచబాటలోని కాళీయాలయమును ప్రవేశించి యుదరదేవతను బూజింపనేగెను.

సత్యాన్వేషి.



## ని. రా. ఆ. మహాసభ స్థాయిసంఘమునకు విన్నపము

ఎనిమిదవ ఆంధ్రమహాసభ నల్లగొండజిల్లా హుజూరునగరు తాలూకాలో జరుగనున్న అధ్యక్షునియెన్నిక కై జిల్లాసంఘములకు తెలిపినట్లు గోలకొండపత్రికలో యిదివరకు ప్రకటింపబడెను. ఇదివరలో ఆంధ్రమహాసభలు జరిగినప్పుడు అధ్యక్షునియెన్నిక జిల్లాసంఘములకే యుండియుండెను జిల్లాసంఘములేని జిల్లావారు వ్యక్తిగతరీత్యా ఎన్నికలు పంపుతే స్థాయి సంఘమువారు వాటిని తోసివేసిరి. ఆరోజులలో తాలూకాసంఘములు మాత్రము లేకుండెను. ఇప్పటి ఆంధ్రమహాసభాధ్యక్షుని కృషివల్ల చాలవరకు తాలూకాసంఘములు ఏర్పాటుఅయి, జిల్లాసంఘములకన్న మంచికృషి చేస్తుయున్నవనిన నతిశయోక్తి కాదు. మంచిపట్టుదలతో పనిచేస్తున్న తాలూకాసంఘములకు అధ్యక్షునిఎన్నికాధికారము లేకపోవడము శోచనీయమయినవిషయము! ఇదినూతనపద్ధతి ని భావించుదురేమో! జిల్లాసంఘములు స్థాపింపబడకమున్న స్థాయిసంఘమువారె అధ్యక్షునిఎన్నుకొనె ఆచారముండెకదా? జిల్లాసంఘముల స్థాపనతరువాత వాటికిగూడ, ఆయధికారమొసంగయుండిరి. అయాకాలముతాలూకా సంఘములకు వర్తింపజేయుటత్యవసరము, తాలూకామొత్తానికి బాధ్యతవహించి పనిజేయుసంఘమునకు ఈనాటిగొప్పబాధ్యత తప్పక యివ్వవలదని కోరుతున్నాము—

ఇట్లు
పి. పి. యల్. గుప్త.

## బహిరంగలేఖ

నిజామాబాదు జిల్లా ఆరుమూరుతాలూకా చౌటుపల్లి గ్రామకాపురస్థుడయిన హనుమంతరెడ్డి పోలీసుపటేలు గారికి— శ్రీపద్మశాలీయువకసంఘము బొంబాయిఅధ్యక్షుడైన వీరయ్యనాగయ్యగుర్రప్పవినయపూర్వకముగా వ్రాయుటయేమనగా అయ్యా మీయొక్క గ్రామము చౌటుపల్లిలో రథమహోత్సవము చేయుచున్నారని రథముయొక్క ఫోటోతీసుకొని శ్రీలక్ష్మణాచారి గారికుమారుడు క్రిష్ణమాచారి గారి మీనవనిజాం రాష్ట్రపద్మశాలీయులలో బొంబాయిలోనివసించుచున్న వారియొద్ద చందావసూలుచెయ్యుమని చెప్పినారని చందావసూలుచేస్తూయున్నాడు ఈయొక్క నిరుపేదనైన నిజాంరాష్ట్రవెట్టిచాకిరీ లకుభయపడి బ్రతుకలేక బొంబాయివస్తే మాబోటిసంఘముధారకులు దేశభక్తులుఇట్లు ఆజ్ఞలుయిచ్చుటవాయమా కాబట్టిమీరు అజ్ఞయిచ్చినారా లేదా మీఅభిప్రాయము గోలకొండపత్రికద్వారా త్వరగా తెలుపగలరని నమ్ముచున్నాను. మీకు శ్రమయిచ్చినందుకు క్షమించగలరు—

ఇట్లు
వీరయ్యనాగయ్యగుర్రప్ప
శ్రీప-శా-యు-సంఘ అధ్యక్షుడు

## మైసూరుకు బెంగుళూరు నిచ్చేమాట

### త్వరలో నిర్ణయంకావచ్చును

మైసూరు మహారాజాగారును దివాన్ సర్ మీర్జా ఇస్మాయిల్, మరికొందరు కార్యదర్శులున్నగు అధికారులతోసహా ఎర్రిరైలులో నాడు మైసూరునుండి మదరాసుమీదుగా ఢిల్లీకి ప్రయాణమై మహారాజుగారు మార్చి ఒకతేదిన వైస్రాయి గారిని దర్శించి మాట్లాడెదరట. మైసూరులో ఉండే బ్రిటిషు రెసిడెంటుగారు మార్చి ఒకతేదిన ఢిల్లీకి బయలుదేరిపోయిరి ఆయనకు మహారాజాకారు ఏదోఒకముఖ్యవిషయంలోనే పోయినట్లు అనుకొనుచున్నారు. బహుశా బెంగళూరు మైసూరు మహారాజాగారికి ఇచ్చివేయువిషయంలో ఇదివరకే విశేషాంశాలు తీర్మానమై, అఖరునిర్ణయంగురించేసమయంవచ్చినది కాబట్టి, అవిషయంలోనే మహారాజాగారును, రెసిడెంటుగారును ఢిల్లీకిపోయియుందురని మదరాసు దినపత్రికయగు "హిందూ" విలేఖరి ఊహించుచున్నాడు బెంగుళూరును మైసూరు మహారాజాగారికి స్వాధీనములో మైసూరు శాసనసభలో రెండుసార్లు ప్రజలుకోరినవిషయమును విన్నవించెను. ఈరొండ్రూరులోనిహిందువులు రెసిడెంటుగారికి బెంగుళూరు పురపాలకసంఘమునకు మనవిద్వారా ఒకవిజ్ఞప్తిని పంపుకొనియున్నారు

## కాంగ్రెసుతో సమాధానానికై ముస్లింలీగు నాయకుని సంసిద్ధత

అఖిల ముస్లింలీగు నాయకుడగు చౌద్రిఖలీకు జ్జామాను గారు ఫిబ్రవరి ౨౮ వ తేదీనాడు ఢిల్లీలో ఉపన్యసించుచు కాంగ్రెసుతో సమాధానముకుదురుట తనమట్టుకుసంతోషమేనని చెప్పి యుండిరి- ఇదేఅభిప్రాయము ముస్లింలీగువారలలో అనేకులకున్నట్లు మదరాసుదినపత్రికయగు 'హిందూ'పత్రికయొక్క క్రొత్తఢిల్లీవిలేఖరి తెలుపుచున్నాడు. జిన్నా గారికిఆగ్రహంకలుగునేమో యనుభయముచేవారు తమఅభిప్రాయములను బహిరంగంగాచెప్పుటకు సాహసించకున్నారట. ముస్లింలీగుకొన్నిలువారు ఇటీవల పంజాబులోని ముగ్గురుపలుకుబడిగల ముస్లింలీగుసభ్యులను యుద్ధసంఘాలలోచేరి వాటిఆలోచనలలో పాల్గొన్నందుకై తొలగించియుండిరిగదా. ఆచర్యవల్ల అనుకోనిదుష్ఫలితములు కలుగవచ్చునని 'హిందూ' విలేఖరి కనిపించుచున్నది. సర్ సికందర్ హయాత్ ఖాన్, ఫజ్లుల్ హక్ గారల తోడ్పాటులేనిచో ముస్లింలీగుకు పలుకుబడిఉండదని పంజాబులో సికిందర్ హయాత్ ఖాన్ గారి పార్టీ ప్రతినిధులుఅనుచున్నారట, అసలునిజంగాకూడ సరిహద్దురాష్ట్రంలోను. సింధురాష్ట్రంలోనుకూడ ముస్లింలీగును బలపరచేవారు చాలాకొద్దిమంది యేనట, ముసల్మానుజనసంఖ్యత తక్కువగానున్న చోటనే ముస్లింలీగుకుబలమున్నదట.అక్కడైనా అనేక ముస్లింలీగునాయకులకు జిన్నాగారి ఇప్పటిపద్ధతియందు విశ్వాసము లేనేలేదట.పంజాబుముసల్మానులు పాకిస్థానవిధానాన్ని బలపరచినచో హిందువులు, సిక్కులును యూనియనిస్టుపార్టీలోనుండి లేచిపోగలరు. అందువల్లజిన్నాగారు మార్చినెల మొదటిరోజులలో క్రొత్తగాముస్లింలీగుకు సభ్యులనుచేర్చుకొనుచు లాహోరులో కొంగ్రెసుకొంతకాలం పంజాబులో కొంచెం శాంతంగా వివేచనచేయగలవారు తమరాష్ట్రం శాంతికుపేక్షిస్తున్న సమయంలో జిన్నాగారి పాకిస్థానప్రచారంవల్ల భిన్నమతస్థులకైరాలు రాజుకొనుతుపోయని భయపడుచున్నారు-

—

## ఆమెరీగారు :మాటతప్పుట

సావర్కారుగారి అభిప్రాయము

ఇండియాసెక్రెటరీఆఫ్‌స్టేటుఅగు ఆమెరీగారు ఫిబ్రవరి ౨౮ వ తేదీనభారతదేశమునుగురించి బ్రాడ్‌కాస్టుఉపన్యాసంలో చెప్పినవిషయాలనుగురించి అఖిలభారతీయ హిందూమహాసభ అధ్యక్షుడగు వి.డి.సావర్కారుగారు అభిప్రాయమిచ్చుచు ఆమెరీగారిఉపన్యాసము ఇదివరలోయుద్ధముప్రారంభమైనవాటినుండి ఆంగ్లేయనాయకులుచేసిన అన్నిప్రకటనలకంటెకూడ చాలాఅధ్వాన్నంగాఉన్నదనిరి, యుద్ధప్రారంభంలోచేసినట్టియు, ఫ్రాన్సుజర్మనులచే ఓడించబడినపుడు మరలబలపరచబడినట్టియు వాగ్దానములను కూడ ఆమెరీగారు త్రోసివేయుటకు యత్నించుచున్నారు. బ్రిటిషువారికి ఆఫ్రికాలోకలిగినవిజయాలను ఈలిబియా కతనము ఫలితమైయుండునా? యుద్ధములో తమకుపజయములు కలుగుచుండినపుడు బ్రిటిషుప్రభుత్వమువారు చేసినతియ్యనివాగ్దానములను ఇటువంటిఅర్థవిజయాలు మరిపింపజేయుచో, బ్రిటిషువారికి యుద్ధంలోసంపూర్ణవిజయంకలిగినతర్వాత భారతదేశపరిపాలన చరమలక్ష్యమునుగూర్చియు వారుచేసినవాగ్దానములనన్నిటిని మరచిపోకుండాఉండగలరని ఎవరనుకోగలరు. పాకిస్థానవిధానమును ఆమెరీగారును బ్రిటిషుప్రభుత్వమువారును వెంటనేనిరాకరించకుండుటకు కారణము అన్యాయమనుఆలోచనగాని, భారతదేశంలోని ఇరుపక్షాలవారును ఏదోఒకఒడంబడికచేసికొంటే బాగుండుననేఆశ మాత్రము గానికాదు అదికేవలముకపటబుద్ధియే" అని సావర్కారుగారు చెప్పినారు.

## బెంగాలులో జనపరిగణన

ప్రధానిహక్ గారికాక్షేపణ

బెంగాలులో జనపరిగణనయందు హిందువులు తమసంఖ్యను ముసల్మానులు తమసంఖ్యనుఎక్కువగాచెప్పి వ్రాయించుచున్నారనియు, ఈ పోటీలో ముసల్మానులకే నష్టముకలుగుననియు బెంగాలుప్రధాని ఫజ్లుల్ హక్ గారుఅనేకపర్యాయములిదివరలో ఆక్షేపణలు తెల్పినారు. బెంగాలులో జనపరిగణనాధికారులు ఇప్పుడు జనపరిగణనచేసేపద్ధతియే ప్రధానిహక్ గారికి ఇష్టముగాలేదు.-అందువల్ల జనపరిగణన పూర్తికాగానే తేలేడిఫలితములు హక్కుగారనుకొనునట్లు లేకపోయినచో వారు తమతోడిమంత్రులతోసహా రాజీనామావచ్చునని "స్టార్ ఆఫ్ ఇండియా" అనేకలకత్తాపత్రికలో వ్రాయబడినది. ఇదిముస్లిం దినపత్రిక సాధారణంగా ఈపత్రిక బెంగాలుమంత్రివర్గమునుగురించిన సమాచారములను సరిగా తెలుపుచుండును.

సంవత్సరము చందా
౬ హాలి రూపాయిలు
(illegible)
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫–౮–౦ శిల్లాడు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only Popular Paper That reaches The masses In the Dominions
Best Medium for Advertisement

**Volume 15** | **Hyderabad-Dn** | **Monday 10 th March 1941** | **Number 85**

## సప్రూ మున్నగువారితో గాంధీజీ సంభాషణలు

### గాంధిమహాతుని ప్రకటన

వార్ధా, మార్చి౬.

గాంధిమహాత్ముడు పత్రికలకు ఈక్రింది ప్రకటనము గావించినాడు:-

పత్రికాప్రతినిధులు ఊహించి పత్రికలలో వ్రాయువిషయములను నమ్మరాదని నేను ప్రజలను హెచ్చరింపవలసియున్నది. నేను సర్ తేజబహద్దర్ సప్రూ, సర్ జగదీశ్ ప్రసాదు, పండిత మదనమోహనమాలవ్యాగారలతోను, మరునాటి ఉదయము మౌలానా అబుల్ కలామ్ ఆజాదు, శ్రీమతి విజయలక్ష్మి పండిట్ సతితోను గావించియుండిన సంభాషణలకు ప్రజలు ప్రాముఖ్యమేమియు నొసంగరాదు, సేవాగ్రామమునుండి నేను బయలుదేరినప్పుడు వీరితో మాట్లాడునుద్దేశ్యము లేకుండెను. అలహాబాదు వెళ్ళితిని- గనుక మిత్రులను చూచి మాటలాడితిని. నేను ఒక్క పనికిమాత్రమే వెళ్ళితిని. విద్యార్థులు, గార్యాలీ కార్మికులు మున్నగువారితో నేను మాట్లాడుట దైవికముగా జరిగెను. సర్ తేజబహద్దర్ సప్రూగారు జబ్బుగానుండుట చేతవారియింటికి వెళ్ళి నేను మాట్లాడితిని. మేము చిరమిత్రులము. నన్ను చూచుటకు వారు రావలసియుండెను. కాని వారు జబ్బుగానున్నట్లు తెలిసి నేనేవారివద్దకు వెళ్ళితిని. రాజకీయస్థితిగతులను గూర్చి మేము మాట్లాడినమాట వాస్తవమే. కాని అంతకంటెయెక్కువగా హిందూమహమ్మదీయ సమస్యవిషయమై మాటలాడితిమి. సర్ తేజబహద్దర్

న ప్రస్తుతరాజకీయప్రతిష్టంభనము తొలగవలెనని యు మతపక్ష్యము యేర్పడవలెననియు, ప్రజలు గాఢముగా నిచ్ఛగించుచున్నట్లు నేను తెలిసికొనుచున్నాను. కాని ప్రజలుకోరినంతమాత్రమున ఈ సమస్యలు పరిష్కారముకావు. ఇట్టికోర్కెకల వారందరుకలసి ప్రయత్నించినప్పుడే సమస్యలు పరిష్కారము కాగలవు. ఊహలు, కల్పనలు యిందుకు ప్రతిబంధకములు. కాంగ్రెసువారి పద్ధతులు, కార్యాచరణవిధానము అందరికి తెలిసినవే. తమకుమాత్రము అనుకూలమగు పరతులను సాధింప ప్రయత్నించుచున్నారనుమాట సర్వాబద్ధము. వాక్ స్వాతంత్ర్యము అందరికిని కావలసినదే. భారతీయులకు లభించు స్వాతంత్ర్యమెట్టిదిగా నుండవలెనను విషయము ప్రజలందరి వోట్లపై నాధారపడియుండును, స్వాతంత్ర్యము దౌర్జన్యరహిత పద్ధతుల ద్వారా లభించవలసినచో కేవలము మెజారిటీవోటువలన నేమియు ప్రయోజనముండదనుట స్పష్టము. స్వాతంత్ర్యప్రణాళిక మైనారిటీలయొక్కయు, అసంఖ్యాక భారతప్రజల క్షేమమునకు ప్రతినిధులుకాని ఇతరసంస్థల యొక్కయు బుద్ధిపూర్వకమగు అంగీకారముపై నాధారపడియుండవలెను.

ఇదియిట్లుండనిండు, యుద్ధముతో సహా నన్ని విషయములలోను ప్రజలందరికిని సంపూర్ణమగు

హోలీపండుగవల్ల రాబోవు గురువారము సంచిక ప్రకటించబడదు.

గో. ప. సంపాదకుడు

గారియింటిలో భోజనముచేయుటకు సర్ జగదీశ్ ప్రసాదుగారువచ్చి సంభాషణలలో పాల్గొనిరి. ఈసంభాషణలకు రాజకీయప్రాముఖ్య మేమియు నొసంగరాదు. వ్యక్తులముగా మేము మాట్లాడితిమి. ఏదోఒకపనిపెట్టుకొని మాట్లాడలేదు. ప్రస్తుత ప్రతిష్టంభనమును అంతముచేయుటకు సర్ తేజబహద్దర్ గారు ఆతుర్దాగానున్నారు. ఇట్టి ఆతుర్దా యెవ్వరికిలేదు! హిందూ మహమ్మదీయసమస్యమునకు పరిష్కారమైనయిచ్చును. విశమత్యము కలిగించుటకు నాకుగల శక్తిని అయన గొరంతలు కొండంతలు చేయుచున్నాడు. ఇందువిషయమై సర్ జగదీశు గారి ఆతుర్దా సర్ తేజబహద్దర్ గారి ఆతుర్దా కంటె మాత్రము తక్కదు, కాని ఈసంభాషణలు కేవలము మిత్రభావమున జరిగినవే గాని, అన్యముకాదు.

### మాలవ్యాగారితో సంభాషణ

మాలవ్యాజీ మహరాజ్ గారితో సంభాషణ గూర్చి యిట్టిదే. అయనవృద్ధుడు, వారు ప్రస్తుతసమస్యలను గూర్చి మాట్లాడెదరు. వారు చాలనీరసముగానున్నారు- కాని దేశవ్యవహారములు వారికి ఆహారముతో సమానము. కాని, భగవద్గీతను వారు పఠించునప్పుడును, మననము చేయునప్పుడును మాత్రమే వారు దేశసమస్యలనుగూర్చి అలోచింపమానుదురు. ఈవిషయములు వారికి ప్రాణతుల్యములు- వారిఊపిరిపోవునప్పుడే వారివిషయమై అలోచించుటమానరు- అశరీరియగు దేహి వెళ్ళుతావుకు గూడ వారు పీనినింపోవు నీమా తెలియదు. ఈమిత్రులతో మాట్లాడుట మహాభాగ్యము. కాని మా సంభాషణలు దేశముయొక్క రాజకీయస్థితిగతులకు మాత్రము సంబంధించినవి కావు. చెరవాలకు వెళ్ళి మౌలానా ఆజాదు, శ్రీమతి విజయలక్ష్మి పండిట్ సతితో మాట్లాడినమాటలుగూడ రాజకీయములకు సంబంధించినవి కాజాలవు.

### కాంగ్రెసు వైఖరి

ఈసంభాషణలవిషయమై అనేక కల్పనలు చేయబడెను. ప్రజలువానినినమ్ముచున్నారు. ఇందువల

వాక్ స్వాతంత్ర్యముండవలెనని కోరుచు కాంగ్రెసువారు సత్యాగ్రహోద్యమమును ప్రారంభించిరి. ఇది, ప్రజలందరి వాంఛితార్థసిద్ధికై కాంగ్రెసు వారు ప్రారంభించిన ఉద్యమముగాని అన్యముకాదు. ఇంక సత్యాగ్రహోద్యమమునందు లోపమున్నదందురా? ఇంతకంటెమంచివిధానము కనుగొనబడువరకుదీనినవలంబింపవలెనని నేను చెప్పుదును.

### బొంబాయి తీర్మానమునకు అర్థము

బొంబాయితీర్మానమునకు నేను గావించియుండిన అర్థము సరికాదని చాలమంది తీవ్రముగా నాక్షేపించిరి. నేనుచేసినవ్యాఖ్యానమే సరియైనదని నేనుతలచుచున్నాను. కాని అది ఒకవ్యక్తి చేసిన వ్యాఖ్యానముమాత్రమే, కాంగ్రెసుతీర్మానములకు వ్యాఖ్యానముచేయుటకుగాని. దానిని మార్చుటకుగాని నాకుఅధికారమెవ్వరు నిచ్చియుండలేదు. అపని కాంగ్రెసుఅధ్యక్షునిది: కార్యవర్గముది. అ.భా.కాం. కమిటీది. నాకుగల అధికారము సత్యాగ్రహోద్యమము నడుపుటకు మాత్రమే ఒడంబడిక జరుగవలసిన సమయము వచ్చినప్పుడు షరతులను నిర్ణయింపవలసినవారు కాంగ్రెసు కార్యసంఘము వారు. వారికి నేను సలహానిచ్చువాడనుగామాత్రముందును. నేను చేసిన వ్యాఖ్యానమును కార్యసంఘమువారు నిరాకరింపవచ్చును. తాముచేసియుండిన తీర్మానములను కార్యసంఘము వారుగాని, అ.భా.కాం. కమిటీవారుగాని మార్చవచ్చును. ఈలోపల, ప్రతివాదు, కాంగ్రెస్ వాదులుగాని, ఇతరులుగాని బొంబాయితీర్మానముపై నాధారపడుదురుగాక! బొంబాయితీర్మానముపై నేను గావించిన వ్యాఖ్యానముపై నాధారపడకుందురుగాక! కావున, యుద్ధముజరుగుచున్న సమయమున, స్వాతంత్ర్యమునకేమాత్రము భంగకరపడిన ఒడంబడికయుండరాదని నేను గావించియుండిన ప్రకటన ప్రజలకెందుకు భీతావహము కల్గించుచున్నదో నేను గ్రహింపజాలకున్నాను.

---

## బందరు రేవు

### భ్రమ కలిగించు వార్తలు

స్వ. వి.

ఇటీవల ఆంధ్రపత్రికలో బందరురేవునిజాము వశియ్యబడునేమో అనియు అచ్చటి పులివాడను గ్రామానికి ఖమ్మంపట్ కలెక్టరు వెళ్ళి బందరులో నుదిగి అచ్చటిరేవును చూచినాడనియు, ఫోటోలు తీసుకొనెననియు, రేవులో స్టీములో ప్రయాణము చేసెననియు. తర్వాత మద్రాసునుండి నిజాం పోలీసు సూపరింటెండెంటు పోలీసుసిబ్బందితో కొన్నాళ్ళ అచ్చటఉండివచ్చెననియు, ఇదేదో అంతారహస్యంగా జరుగుచున్న పనిఅనియు "ఆంధ్రపత్రిక" స్వకీయవిలేఖకుడు వ్రాసెను.

ఖమ్మం సబ్ కలెక్టరుపోయినదినిజమే- సూపరింటెండెంటుగారున్నూ పోయినదినిజమే కాని బందరురేవుకొలతకుగాదు- ఖమ్మం దువ్వంతాలూక్దారుగారు భార్యాయుక్తంగా కుటుంబయుక్తంగా వ్యాహ్యాళికి వెళ్ళినాడు- మరిసూపరింటెండెంటుగారో వారు శ్రీయస్.యజ్.రెడ్డిగారు వారుమద్రాసులో మోటారుకర్మికుల పర్యవేక్షణలో ట్రెయినింగుపొంది బందరులోను ఒకవారం ట్రెయినింగుపొందుటకు వెళ్ళివచ్చినారు- అంతేకాని పైయిరువురిఅధికారులకును బందరురేవుతో ఏమిన్నీ సంబంధము లేదు- అని రూఢిగా తెలిసినది.

---

## అష్టమాంధ్ర మహాసభ

### ఆహ్వానసంఘపు ఏర్పాటు

నల్లగొండ, ౩–౬–౧౩౫౦ ఫస్లి.

ఆంధ్రమహాసభ స్థాయి సంఘాధ్యక్షులవారు నల్లగొండకు విచ్చేసిరి. శ్రీయుత పులిజాల వెంకటరంగరావుగారి భవనమందు సమావేశము జరిగెను. ఈక్రిందివిషయములు తీర్మానింపబడినవి:—

౧. నిజాంరాష్ట్ర అష్టమాంధ్రమహాసభ శ్రీవృష సం॥ర వైశాఖ బ ౧౨–౧౩–౧౪ లకు సరియగు తేది ౧౬–౧౭–౧౮ సర్ ౧౩౫౦ ఫస్లి. చిలుకూరుగ్రామం (తా॥ హుజూరునగరం)లో జరుపుటకు నిశ్చయింపబడినది. ఈ క్రిందివారముగా ఆహ్వానసంఘసభ్యుల ఎన్నుకోబడిరి:—

౧ శ్రీయుత జదిరెగోపాలరెడ్డిగారు, అధ్యక్షులు.
౨ ,, వెనేపల్లికొండల్ రావుగారు, ఉపాధ్యక్షులు,
౩ ,, కె. రామలక్ష్మయ్యగారు ,,
౪ ,, పులిజాలరంగారావుగారు ,,
౫ ,, గవ్వా అమృతరెడ్డిగారు ,,
౬ ,, రామచంద్రారెడ్డిగారు, హుజూరునగరం. ,,
౭ ,, దోమలపల్లియాదగిరిరావుగారు ,,
౮ ,, యం. నారాయణరెడ్డిగారు ,,
౯ ,, బి వి. నర్సింహారావుగారు సంయుక్తకార్యదర్శులు,
౧౦ ,, కె. వెంకటరామారావుగారు ,,
౧౧ ,, పి. రామారెడ్డిగారు, మిరియాలగూడెము. ,,
౧౨ ,, బి. వెంకటరామారావుగారు, హుజూరునగరం ,
౧౩ ,, నీ రంగారావుగారు, సూర్యాపేట ,,
౧౪ ,, యం కోండలరావుగారు దేవరకొండ ,,
౧౫ ,, డి మట్టపల్లిరావుగారు,జన్గామ ,,
౧౬ ,, పన్నాల వేంకటరామారెడ్డిగారు, వకీలు, భువనగిరి ,,
౧౭ ,, రాజగోపాలరావుగారు, ప్రత్యేక సహాయకార్యదర్శులు

ఉపాధ్యక్షులై పులిజాల రంగారావుగారి కోశాధ్యక్షపదవి స్వీకరించుటకు తీర్మానించబడినది. మరియు ప్రతితాలూకానుండి ముగ్గురు సభ్యులను ఏర్పాటుచేసిరి.

పరిస్థితులననుసరించి సంఘసభ్యులసంఖ్య హెచ్చించు అధికారము అధ్యక్షులవారికియుండగలదు కనీసము (౫)రు సభ్యులు వచ్చినచో కార్యనిర్వాహకవర్గ సమావేశము జరుగుటకు వీలుండదు.

---



Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A B.L.